

అధునాతనాంధ్ర కవితాపరమేశ్వరులు

శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు

# త్రివేణి



నాటిక



గురుదేవ
శిష్యపరమాణువు
సర్వా వేంకటశేషయ్య

# పీఠిక

బ్రహ్మశ్రీ వేదమూర్తులైన సర్వా వేంకటశేషయ్యగారు నాకు సర్వవిధముల గురుప్రాయులు. విద్వద్వరేణ్యులు, ప్రతిభా సంపన్నులు నైన వారి రచనకు వేఱొకరు పీఠిక వ్రాయవలసిన యవసరము లేదు. అయ్యును నేనది వ్రాయఁగడంగుటకు రెండు కారణములున్నవి. ఒకటి వారికి నాయెడఁ గల వాత్సల్యవిశేషము ; రెండవది యిందలి వస్తువునకును నాకును బరోక్షముగానైనఁ గల యించుక సంబంధము.

కింకవీంద్రఘటా పంచాననులును, విద్వత్కవిపుంగవులును బహువారరచితాష్టశతావధానవిధానరంజితరాజపండితరాజులునై సుమారొక యర్ధ శతాబ్దికాల మాంధ్ర కవితా సామ్రాజ్యము నేలఁజాలిన తిరుపతి వేంకటకవులలో నొకరై ప్రథమాంధ్రాస్థాన కవీంద్రులై వాసికెక్కిన కీ. శే. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రులవారి నిర్యాణము వస్తువుగాఁ గలదీ చిన్ననాటిక. గౌతమీ కృష్ణవేణీ సరస్వతీ నదు లిందలి ప్రధాన పాత్రలు. అందుచేతనే దీనికి "త్రివేణి" యను నన్వర్థ నామధేయ ముంచఁబడినది. భౌతిక దేహమును వీడిన శాస్త్రిగారి తేజోమూర్తి ఆదిత్య స్వర్లోకములను, సత్య వైకుంఠ లోకములను, శివలోకమును దర్శించి యచ్చటి వేల్పులఁ బ్రస్తుతించి చివరికి మణిద్వీపాధివాసినియుఁ దమ కిలువేల్పునైన కామేశ్వరీదేవి పాదపద్మములందు విలీనమైపోవుట యిందు లెస్సగా వర్ణింపఁబడినది. శ్రీ శాస్త్రిగా రిహమున నున్నప్పు డొకవంక రాజాధిరాజులు తమ్ముసేవింప సర్వభోగముల ననుభవించుచు, వేఱొకవంక కామేశ్వరీదేవి పాదద్వంద్వముల నేకాంతభక్తితో భజించుచు క్తి భక్తిమయ జీవితమును బుచ్చినవారు. భౌతికదేహత్యాగానంతరము,

వారిని భోగాసక్తి వీడినది. వారి తేజోమూర్తి యొక్క మణిద్వీపవాసమును దక్కఁ దక్కిన యన్నింటిని దృణమువలెఁ ద్యజింపఁజాలినది. రక్తి విరక్తులను సమముగా నారాధించి సిద్ధి పొందఁజాలిన దివ్యజీవితము శాస్త్రిగారిది.

తిరుపతి వేంకటేశ్వరుల శిష్యు లసంఖ్యాకులు. అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు, వేటూరి ప్రభాకర శాస్త్రిగారు మున్నగు కీర్తిశేషులును, శ్రీ వేలూరి, విశ్వనాథ, కాటూరి, పింగళి ప్రభృతులైన యాధునిక కవిశేఖరులును వారి శిష్యులలో నగ్రేసరులు. శ్రీ విశ్వనాథ కవిసమ్రాట్టు లన్నట్టు లప్పుడు "చెళ్ళపిళ్ళ వేంకన గురువంచుఁ జెప్పుకొనఁగా నది గొప్ప తెలుంగునాడునన్." ఈ నాటికలోఁ బైవారికిఁ గూడ నచ్చటచ్చటఁ బ్రసక్తి కల్పింపఁబడినది. శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు బ్రహ్మలోక నివాసులనుటయు, తిరుపతి శాస్త్రిగా రాదిత్య లోక వాసులనుటయుఁ బరమౌచిత్య శోభితమైన భావనకు నిదర్శనములు. కవిసార్వభౌములు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు వేంకటశాస్త్రిగారికి గురువులు. శిష్యమరణము విని వారు పుత్త్రవియోగ వేదనాదోదూయమానుఁడైన తండ్రివలె విలపించిరి. ఒకప్పుడు గురుశిష్యు లిరువురికిఁ గొన్ని యభిప్రాయభేదము లుండినను, ఆ భేదములు శిష్య మరణ సందర్భమున పూర్తిగా విస్మృతములై యచ్ఛమైన కరుణ రూపమునఁ బరిణమించుట కవిసార్వభౌముల గుండె మెత్తందనమునకు దృష్టాంతము. విశ్వనాథులన్నట్లు వారు ప్రసన్నులగుట వేంకటశాస్త్రిగారి యాత్మశాంతికిఁ దప్పక దోహద మిచ్చియుండును. "తాతగారూ! ఇది మీకుఁ బుత్త్రవియోగము. మాకుఁ బితృవియోగము" అని శ్రీ ప్రభాకర శాస్త్రిగారన్న కరుణరసపూరిత వాక్యములు విన్నప్పు "డపి గ్రావా రోదిత్యపి దళతి వజ్రస్య హృదయమ్."

గౌతమీ కృష్ణవేణులు తెలుఁగునదులు. సరస్వతి భారతీయనది. ఆమె యంతర్వాహిని. ప్రకటయును గూఢయునై యామె త్రివేణీసంగ

మమునఁ గృతపుణ్యులైన మహనీయులకు మాత్రమే గోచరించును. వేంకటశాస్త్రిగారు సంస్కృతమునఁ గూడఁ గవిత వెలయించినను శ్రీనాథునివలెఁ బ్రధానముగాఁ దెలుఁగుకవులు. వారిమృతి తెలుఁగుతల్లి కపరాకృతులైన కృష్ణా గౌతమీ తరంగిణుల గుండెలు యథాయథములు గావించునది. వారి శోకము వెల్లువలై ప్రవహించి తెలుఁగునేలనెల్ల నావరించినది. సరస్వతి తన తోఁబుట్టువులైన యా నదుల నోదార్చుటకు వచ్చి వారి ప్రార్థనపై నించుకసేపు దివ్యదృష్టి యొసంగి వారికి మృతపుత్ర తేజోమూర్తి దర్శనము కావించినది.

ఈ నాటికయందలి ప్రధానరసము కరుణము. అది పెక్కెడలఁ బొంగి పొరలుచున్నది. త్రివేణులును గలసికూడ దానిని భరింపఁజాలక పోయినవి. ఇటీవల రచింపఁబడిన కావ్యములలో నింత వినిర్మల కరుణ రస పరిపోషముగల కావ్యము నేను జూడలేదు. చదువునప్పుడు వజ్రహృదయుఁడైన, మొగమువంచి కన్నీరు మున్నీరుగాఁ గార్చక తప్పదు. కరుణము నింత నిశితముగా వర్ణింపఁజేసినది కవిగారికి గురుమూర్తియెడఁ గల యనన్య సామాన్యమైన భక్తివిశేషము. ఆ భక్తి యీ "త్రివేణి" యందలి ప్రతిబిందువున జాలువాఱి చదువువారి యొడళ్లఁ బులకలెత్తించితీరును. ఇహపర సౌఖ్య హేతువైన యట్టి నిర్మల గురుభక్తి సర్వథా జయించుఁగాక.

శ్రీ శాస్త్రిగారి మృతి విని యాంధ్రదేశమంతయు నేడ్చినమాట సత్యమే. వారొక్కయూరివారు కారు. దేశమంతయు వారిదే. వారు చూడని రాజు లేడు; వారి యవధాన సౌరభములు వెల్లివిరియని యూరు లేదు. గంగాతరంగిణీ ప్రవాహవేగమైన వారి యాశుకవిత చవిచూడని సీమలేదు. వారాంధ్రదేశమున నపూర్వమైన కవితా వాతావరణము కల్పించిరి. వారు దివంగతులైనను ఆ వాతావరణము మాత్రము శేషించినది. అది తెలుఁగునేల యదృష్టము.

నాటిక యంతయుఁ గొంచె మించుమించుగాఁ బద్యమయముగా సాగినది. ప్రతి పద్యము నొక కరుణరస ఖండము. కవిత ధారాళమై, భావగంభీరమై, జాతీయ పద శోభితమై యతిమనోహరముగా నున్నది. పూజ్యులైన వేంకట శేషయ్యగారి పవిత్ర చరిత్రము వారి కవితలోఁ బ్రతిబింబించు చున్నది. రసవత్కవితా సృజన కల్యులైన వారింకను మహాకావ్యములు పెక్కు నిర్మించి దేశికుల శేముషికి వైజయంతికలు తీర్తురుగాక.

ఉస్మానియా విశ్వవిద్యాలయము.
హైదరాబాదు.
8—2—1959.

—దివాకర్ల వేంకటావధాని

శ్రీమత్పరదేవతాయై నమః

# నివేదనము

యస్య దేవే పరా భక్తిః యథా దేవే తథా గురౌ
తస్యైతేఽకథితాహ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః.

ప్రాతః స్మరణీయులు, అధునాతనాంధ్రకవితాపరమేశ్వరులు, బ్రహ్మశ్రీ శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి మహోదయులు క్రీ. శ. 1870 సరియైన ప్రమోదూత సంవత్సర శ్రావణశుక్ల ద్వాదశీ సోమవారమున నవతరించి, క్రీ. శ. 1950 సరియైన విరోధినామసంవత్సర మాఘ కృష్ణ చతుర్దశీ బుధవారమున శివసాయుజ్యము నందిరి. శ్రీ తిరుపతి వేంకటేశ్వర సారస్వతోద్యోగవిజయములు ఆంధ్రసాహిత్య చరిత్రలో స్వర్ణయుగమును వెలయించినవి. గౌతమీతీరమున జనియించి, తిరుపతి సహవాసము గణియించి, లక్ష్మీకరగ్రహణ మొనరించి, సరస్వతీ సమారాధనము గావించి, కవితాలతాంగికి అపూర్వావధానచూడామణి గైసేసి గీర్వాణాంధ్రభాషా గాంభీర్యమాధుర్యలాలిత్యసౌకుమార్యముల వెల్లివిరియించి, శతసహస్రాంతేవాసికులంబుల నుద్ధరించి, తురీయాశ్రమంబున కృష్ణాతీరస్థక్షీరసాగరనామక సౌధరాజంబున విశ్రమించి, నిరుపమతపంబు సలిపి, దుర్గాక్షేత్రమ్మున శివరాత్రి పుణ్యపర్వమున సాంబసదాశివైక్యము నంది తరించిన ఆచార్యపాదుల జీవితవిశేషములు ఆంధ్రులకు సువిదితములు, గర్వకారణములు.

పుత్త్రో మే హరివిజయః త్రివేణీ ప్రియపుత్రికా
తయో ర్దర్శనమాత్రేణ తితీర్షామి భవాంబుధిమ్.

1950 సం. మార్చిమాసమున రచితమైన ఈ త్రివేణి నీనాటికైన సహృదయసహోదరులకు నివేదింపగలిగినందులకు సంతసించు

దేవకులసీమ
మహాశివరాత్రి
7-3-1959

గురుదేవ
శిష్యపరమాణువు
వేంకటశేషయ్య

శ్రీమత్పరదేవతాయై నమః
జయతు జగదీశ్వరీ
విజయేతాం తిరుపతి వేంకటేశ్వరౌ

# త్రివేణి

శ్లో. వదనం మధురం – వాణీ మధురా
హృదయం మధురం – శిక్షా మధురా
హసనం మధురం – చర్యా మధురా
సర్వం మధురం – మధురాంధ్రకవేః.

[ తెరలో ]

కృతకృత్యు లెదురుచూతురు
మృతిని బ్రియాతిథిగ, వారె మృత్యుంజయు, లా
హతతాపము కృతమంగళ
మతిసుఖదము తత్కథామృతాస్వాదనముల్.

గౌతమి : (సంభ్రమముతో బ్రవేశించి)
అడుగిడినయంత విననయ్యె నక్కటకట!
మృత్యుగర్భ ప్రసంగమ్మదేమొ కాని,
అదరె వలకన్ను, హృదయంబు చెదరిపోయె!
పాపము శమించుగాత మీశ్వరుని కరుణ.

[ తెరలో ]

జయ ! బుధ సన్నుత సుకృతీ !
జయ ! జయ ! రససిద్ధ ! సరస జలజాతరవీ :
జయ ! అజరామరకీర్తి !
జయ ! జయ ! శ్రితహృదయవర్తి ! జయ శివసుకవీ !

గౌతమి : (సవితర్కముగా)
ఈ జయధ్వను లేటికో, ఈ యనంత
పుష్పవర్షం బదేలకో, మ్రోగు నింగి
నెందుకో దేవదుందుభు, లేమి ? ధరణి
హృదయదారక శోక పరీవృతంబు.

[ తెరలో ]

తీరెనే నేటితో మా యదృష్ట మెల్ల,
ఆగెనే యింద మాదు పుణ్యస్రవంతి,
పండి బ్రద్దలయ్యెనె పూర్వ పాపఫలము,
తప్పిపోయెనె కులదైవతముల కృపయు ?

గౌతమి : ఈ విలాపస్వరంబు మా కృష్ణవేణి
దా ? .... అదే, నిజం, బేదొ యత్యాహితంబు
మూడియుండగనోపు, దోబుట్టు వెందు
గలదొ ?

(పరిక్రమించి)

అదె ! శోకసంతప్త గానవచ్చె.

[ తెరలో ]

కడుపు మండుచుండె, గనులు గానగరావు,
చెవులు వినుటలేదు, చెదరె మదియు,

భారమయ్యె తనువు, ఢావి శూన్యంబయ్యె,
మృతియె మేలు నాకు బ్రతుకుకన్న.

గౌతమి: (పరిక్రమించును, తెర యెత్తుదురు)
[తనలో] ఏమి! ఈ ఘోర దృశ్యము. ఈమె నిజముగ
కృష్ణవేణియేనా? కంటికి మంటికి నేకధారగా ఏడ్చుచున్నది?
కారణమేమై యుండును? ప్రశ్నించి తెలిసికొందును.
(సమీపించి శరీరమెల్ల స్పృశించుచు)
[ప్రకాశముగ] సోదరీ! కృష్ణ! శోకించుచుంటివేల?
సుఖులెగద మన బాంధవుల్ సఖులు హితులు
పుత్రపౌత్రు లారోగ్య సంపూర్ణులెగద,
వేగ దెల్పుము హేతు వుద్వేగమునకు..

కృష్ణవేణి: (సవితర్కముగ)
ఎవరు? ఎవ్వరు?
(స్మృతి నభినయించి)
గౌతమివేన నీవు?
వచ్చితివ? రమ్మ నా ప్రాణపదమ! రమ్మ
కటకటా! ఎంత గొప్ప సంకటమువచ్చె,
ఎట్లు భరియింతు? భరియింతు వెట్టులీవు?

గౌతమి: (మొగము చిట్లించుకొని తీవ్రముగ నాలోచించుచు)
అర్థవిరహితంబులు ననర్థార్థ సూచ
కములు వాక్కుల జిత్త వైకల్యమొదవె
సంశయగ్రస్త మీ మానసంబు, నిజము
తెలిసి తెలియక రెంట విదీర్ణమయ్యె.

[ తెరలో ]

ఆది దేవకి గర్భాన నవతరించె,
నాదట యశోద పెంప జోడాలదూడ
నా మెలంగె, మాతల మహానందలహరి
నోలలాడించె హరి పురుషోత్తముండు.

గౌతమి : (ఆలోచించుచు)
కృష్ణ దెలిపె నాకు విషాదహేతువనుచు,
దెలిపె జోడాలదూడ నా దివ్యవాణి,
(సంశయముతో)
సేమమేకద మా చిరంజీవి కిప్పు
డతడు తజ్జరామరణ వర్జితుడు కాడె ?

[ తెరలో ]

పాపరాశి విరోధిరూపమున నిలువ
నాంధ్రి యగచాట్ల పాలయ్యె నక్కాతమున;
అందుకొనె నంతలో నుత్తరాయణంబు,
వచ్చె శివరాత్రి, పుణ్యసంపత్ప్రదాత్రి.

గౌతమి : (విచారముతో) దైవమా ! శివరాత్రి కాళరాత్రి కాలేదు కదా !

[ తెరలో ]

అమృతకరుడు భాస్కర సమక్షమున కరిగె,
తిరుపతింజేరె లక్ష్మీద్వితీయుడగుచు
హితహితకరుండు శ్రీ వేంకటేశ్వరుండు,
తెలుగుదేశమ్ము గాఢాంధ మలముకొనియె.

కృష్ణవేణి : హా దైవమా ! నన్నింత చిన్నచూపు చూచితివా ?
హృదయమా ! నీవు నన్నింకను వదలిపోలేకుంటివా ?

[ తెరలో ]

ఆంధ్రమాత యఖండ పుణ్యప్రసూతి,
గౌతమీ గర్భశుక్తి ముక్తాఫలంబు,
కృష్ణవేణీ మనోమోద వృద్ధికరుడు,
విశ్వరూపమ్ము ధరియించి వెలయుచుండె.

గౌతమి : విధిహతకా ! ఎంత గావించితివిరా !

[ తెరలో ]

పండిత కవీశ్వరానందవర్ధనుండు,
శ్రీకర శతావధానాది సృష్టికర్త,
చళ్ళపిళ్ళ కులాంభోధి చంద్రముండు,
వీడె భువి, నింక గన్పడువాడుకాడు.

గౌతమి : పరమేశ్వరా ! ఈ పుత్రవియోగమ్ము నెట్లు సహింపగలను ? మా మ్రొక్కిన మ్రొక్కులన్నియు, నోచిన నోములన్నియు భస్మ హవ్యములయిపోయెనే ! ఇంకేది గతి ? కృష్ణా ! ఇంతలోనే యింత యత్యాహిత మెట్లు మూడినదమ్మా !

[ తెరలో ]

వర్తమానాంధ్ర సంస్థాన పండితకవి,
చళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, శతవధాని,
అమరకవిరాజ సింహాసనాధిరూఢు
డయ్యె, సుర బుధ గురు కవు లటమటింప.

కృష్ణవేణి : సోదరీ ! మన చేసిన కర్మలు తుదకిట్లు ఫలించినవిగా!

వడసారము పదియేడుల
బుడుతడు మునుముందు దివిని బొందగ బుడమిఞ
సడి జీవచ్ఛవముల కై
వడి నిలుడని మనముఖాన బ్రహ్మ లిఖించెఞ.

గౌతమి : కృష్ణా !

అతడు చిరజీవియన్న జోస్యమ్ము నమ్మి,
ఎందొ సుఖమున్న జాలునం చెంచియుంటి,
గాని, యింతలోపల మారకంబు పట్టి
పుట్టి మున్గునటంచు గన్పెట్టనై తి.

కృష్ణవేణి : హృదయమా ! నీకు మమకార మెంతగలదు ?

దేహమా ! నీకు నంత వ్యామోహమేల ?
ప్రాణమా ! నీవు కడు మొండిదానవమ్మ !
ఏల, ఈగోల, తనువేల, ఏల బ్రతుకు ?

సరస్వతి : (రెండవ వైపునుండి ప్రవేశించి) [తనలో] పుత్ర వియోగమ్ముచే బొగులుచున్న గౌతమీ కృష్ణవేణుల కెట్లయిన మనశ్శాంతి చేకూర్పవలయునని దేవతలచే నియుక్తురాలనై వచ్చితిని కాని మావాని గుణగణంబులు స్మృతికి వచ్చి నన్నును విచార సాగరమున ముంచివైచి కర్తవ్యమూఢ గావించుచున్నవి. ఏమయినను దైవనియోగమ్ము సర్వధా శిరోధార్యము.

గౌతమి : సోదరీ ! ఎంతకాల మిట్లు వంతచెందినను ప్రయోజనం బావంతయులభింపదు. ఇంక నామనోనిశ్చయంబువినుము.

కట్ట! చెట్టంత పట్టిని మట్టుపెట్టి
ఉట్టి కట్టుక వ్రేలాడనోప నుర్వి;
పట్టి గనుపెట్టికొని వెండిగుట్ట మెట్టి
వంత యెఱుగని శాంతి చేపట్టనెంతు.

సరస్వతి : (సమీపించి)
ఇది తగునా ? గౌతమి ! నీ
కిది యే మన్యాయమమ్మ కృష్ణా ! మృతి త
ప్పదు మర్త్యుల కనియెడు నా
చదువుల మర్మంబు మీరు చదువగలేదా !

గౌతమి : [ఆత్మగతము] ఏమి సరస్వతి వచ్చినదా ?
(అశ్రుపూరిత నేత్రములతో, గద్గద స్వరముతో
సరస్వతిని గౌగిలించుకొని)
సోదరీ ! ఏమంటివి ? మృతి తప్పనిదని చదువలేదా ? అని యనుచుంటివా ?
చదివిన సంగతి నిజమే,
చదివిన మాత్రాన నేమి సంబరమయ్యెన్?
అది స్వీయాచరణంబున
విదితంబగునాడు గాదె విజ్ఞానమగున్.

[ తెరలో ]
భోజు జూడ కవిత మును పుట్టినదొ, లేదొ,
ఇప్పు డెవరు నిజము చెప్పగలరు ?
చళ్ళపిళ్ళ సుకవి స్మరియించి యెల్లరు
కవిత చెప్పి, రిందు కల్ల లేదు.

కృష్ణవేణి : పుత్రా ! నీవంటి పుత్రరత్నమ్మును దక్కించుకొనలేక పోయిన మా దౌర్భాగ్య మనన్యసామాన్యమే.

[ తెరలో ]

భావగంభీర కావ్యసంపదలయందు,
లలిత కోమల కాంత కల్పనలయందు
సరస మేని మనంబు, మా శతవధాని
కావ్యకల్పక మర్థించి కనుడు వాని.

గౌతమి : పుత్రా ! నీ కీర్తి భూలోకము నంతయు వ్యాపించి, యంత దృప్తి నందక స్వర్గాదిలోకంబుల నాక్రమింప నుద్యుక్తురాలయ్యెనా ? తండ్రీ ! నీచేతిమీదుగా దాటిపోవు భాగ్యమునకు నోచుకొనక పోతిమికదా ! మా దురదృష్ట మునకేమి గాని నీ యదృష్టమునకు సాటి నీయదృష్టమే !

నీ జన్మమున గదా ! మా జీవితం బెల్ల
నానందసాంద్రమై యలరజాలె
నీ మూలమున గదా ! నీరసించిన యాంధ్రి
తిరిగి సర్వాంగ సుందరత గాంచె
నీ దర్శకత గదా ! నిఖిలాంధ్ర కవిలోక
మజరామర ఖ్యాతి నందగలిగె
నీ దీవనల గదా ! నీ శిష్య పరమాణు
గణ మందె గవిరాజ గౌరవంబు
ముట్టినది యెల్ల ముత్యమే, పట్టినట్టి
దంత బంగారమే, వ్రాసినట్టి దెల్ల

నమృతలహరియే, నీ ప్రభావాతిశయత
నీ యదృష్టంబు నెవరు వర్ణింపగలరు?

కృష్ణవేణి: కన్నులకు బండువౌనగూర్చు నీ ప్రసన్నవదనము మఱల గనుపడదు గదా! కర్ణరసాయనమ్ములై, రసజ్ఞ లోకారాధ్యంబులై, విద్వత్కవీంద్ర సంస్పృహణీయంబులైన నీ మధురమధురాలాపంబు లాలించెడుభాగ్య మింతతో దీరిపోయెనే? అన్నియు దీరినవి కాని యీ మొండిజీవితముపై నా కాశ తీరలేదు. జీవచ్ఛవంబనై యిట్లెంతకాలమీ యమయాతన ననుభవింపవలయునో? పరమేశ్వరా! నీవు కరుణాపయోనిధి వందురే! నీ కటాక్షవీక్షణ ప్రసారమునకుగూడ నంతరానివారమైపోతిమా!

సరస్వతి: (రుద్ధస్వరంబు సరిచేసికొని) కృష్ణా! గౌతమీ! దుఃఖమునకు మాత్ర ముచితానుచితములు లేవా? వచ్చిన పని దీర్చుకొన్నపిదప స్వగృహమునకు మఱలిపోవు బాటసారిని గూర్చి దుఃఖించు ప్రాజ్ఞులుందురా? ఒరులకు జెప్పవలసిన మన మితరులచే జెప్పించుకోవలసి వచ్చిననాడు శిరశ్ఛేద సదృశమైన దుస్థ్సితి సంభవింపదా? ఇంతకును మనవాడేమేని కానిపోని పనిచేసి లోకముచే దిట్టువడిపోయెనా? పండితపామర జగజ్జేగీయమానుడై లోకాంతర జిగీషతో బయలుదేరినవాడుగదా! అతడు——

కారణజన్ముడై కవిజ
గంబులనేలి సమాప్తకృత్యుడై

తీరగ బంధముల్ బయలు
దేరె శరీరము రాల్చి దేవతా
గారవిహార తత్పరత ;
గట్టడి కోర్చెదరే స్వతంత్ర సం
చారపరాయణుల్ సుకవి
సత్తము ముక్తి విరక్తి హేతువే ?

కృష్ణవేణి : సరస్వతీ ! నీవు చదువుల సరస్వతివే కాని, చావుకన్న దుఃఖములేదని వినలేదా? మృతులైనవారు పునరాగతులైన మాట యెందైన వింటిమా ? నీ వన్నట్లు లతడు సర్వథా చరితార్థుడే యగుగాక, యెంత యత్నించినను నాకు శోక · మాగుటలేదు.

గౌతమి : మరణ మపరిహార్యంబే యైనను వెనుకముందులు లేవా? పెద్దవారు జీవించియుండ బిన్నలు మరణించుటకంటె వేఱు దుఃఖమేముండును ? పున్నామనరకంబు బాపజాలిన పుత్రుని మృతికి విలపించుచు మొండిబ్రతుకు బ్రతుకవలసి వచ్చినదే ? కట్టలు త్రెంచుకొని హృదయమ్మునుండి పొంగి పొరలివచ్చు శోకమహాప్రవాహంబును తత్త్వవిచారము తట్టుకొనలేక పోవుచున్నది. పరోపదేశమ్మున కుపయోగించునంతగ శాస్త్రజ్ఞానము స్వవిషయమున నక్కఱకు వచ్చుటలేదు.

[ తెరలో ]

"ఆశీర్వాదముమాత్ర శిష్యులను
విద్యావంతులఁ జేయు వా

గ్వైశద్యంబున బొల్చు
వేంకటగురుబ్రహ్మంబు సేవించెదన్"

సరస్వతి : [తనలో] పాప మెవరో గురుపదముల నమ్మకొను చున్న యంతే వాసియైయుండనోపును. [ప్రకాశముగ] సోదరీమణులారా !

మృతి యత్యంతాహితమని
మతిహీనులు దుఃఖమంద మన్నింపదగున్:
మతిమంతులు గృతకృత్యుల
మృతికై విలపించు నెడల నేమనవలయున్ ?

[తెరలో]

"వెంకటశాస్త్రి ఎనభై యేళ్ళు బ్రతికినాడు. జీవితాన్ని సార్థకం చేసికొన్నాడు. నాకిది రెండవ పుత్రవియోగము. రెండవ పుత్రవియోగము. రెండవ పుత్రవి..."

కృష్ణవేణి : గౌతమీ ! ఎవరే ఈయన పుత్రవియోగమని విలపించు చున్నాడు ? విలపించి విలపించి మూర్ఛాక్రాంతు డైనట్టు లున్నది.

గౌతమి : ఎవరా ! మన శ్రీపాదకృష్ణుడే ! నా ముద్దులతండ్రి లోకమునంతను శోకమున ముంచివైచుచున్నాడే.

[తెరలో]

"శ్రీపాదతాతగారు అమాయికులు. గురువుగారూ అంతే. తాత గారూ ! ఇది మీకు పుత్రవియోగము. మాకు పితృవియోగము. మాకు పితృవియో...".

కృష్ణవేణి : ప్రభాకరుని కంఠస్వరమువలె నున్నది. లోకానంద మొనగూర్చి యస్తమించిన కవిరాజునకై విలపింపనివా రెవ్వరు ? అన్నా ! వెంకన్నా ? ఎంతపని చేసితివిరా !

[ తెరలో ]

"గురువుగారు శివరాత్రినాడు పోయినారు. అది వారి యాత్మకు శాంతినిస్తుంది. అదిగాక కృష్ణమూర్తి శాస్త్రిగారు ప్రసన్నులైనారు. అది తప్పక గురువుగారి యాత్మశాంతికి దోహదమిస్తుంది."

సరస్వతి : [తనలో] ఇది కుమార విశ్వనాథుడు చేసిన సమన్వయము. ఆ యీ సందర్భమంతయు జూచుచుండ నాకు గూడ మతిపోవుచున్నది. మరణ మెంతవారికైన దుఃఖ కారణ మగునుగదా ! శోకము శోకమునకే దారితీయును. శోకించువారితో శోకించుట సుకరంబుకాని, వారికి వేదాంత శ్రవణంబు చేయుట కడుంగడు దుష్కరంబు. ఏమయినను నా విధ్యుక్తధర్మము నేను నిర్వహింపక తప్పదుకదా ! [ప్రకాశము] తోబుట్టువులారా ! నివార్యములయిన కార్యముల నందఱు నివారింతురు. అనివార్యమయిన కార్యమును నివారించువారేకదా ప్రాజ్ఞులు. మరణ శోకంబులు రెండు ననివార్యంబులేమైనను సకల విధముల యత్నించి శోకము నరికట్టవలయును. నాకు మాత్రము శోకము లేదందురా ? (గౌతమి నుద్దేశించి)

ఔరసుడు నీకు

(కృష్ణను జూచి) నీకు దత్తాత్మజుండు,

నాకు నట్టిడె, మనకు నందఱకు సమమె

వ్యసన, మయినను కన్న మోహంబుకన్న
పెంచినది మిన్నయై విజృంభించుచుండు.

శోక మోహంబులు గ్రమ్ముకొన్ననాడు యథార్థ స్వరూప పరిజ్ఞానము కలుగనేరదు. నిర్వికార చిత్తముతో బరిశీలించిన నాడు తత్త్వము కరతలామలకం బగును.

మరణ మమంగళమే దు
శ్చరితులకుఁ విస్మృతాత్మసద్ధర్ములకుఁ;
మరణము మంగళమే స
చ్చరితులకుఁ గృత సమస్త సత్కృత్యులకుఁ.

గౌతమి: తండ్రీ! ఆ కఠోర మృత్యువు నిన్ను మ్రింగివైచినపుడు నీవెంతగ బరితపించితివోగదా! నిన్ను జూచి చాల కాల మయినది. కృష్ణా! కొంచెము ముందుగనైన దెలియ జేయక పోయితివే! ఱెక్కలు కట్టుకొనివచ్చి వ్రాలి యుందునే.

కృష్ణవేణి: గౌతమీ! ఇంతలో నింతమున్గునని నాకు మాత్రము తెలిసినదా? దగ్గఱనున్న నేనుమాత్ర మేమి చేయగలిగి తిని? నాతో నొక్కమాటయేనియు నాతండ్రి చెప్పిపోలేదే.

సరస్వతి: ఏమి! ఈ యన్యాయము? సర్వజ్ఞుడయిన మనవాని ప్రతిభావిశేషమున కపయశము సమకూర్చుచుంటిరే! అతడు మహర్షి కదా! కాకున్న నీతడిట్టి కవిసార్వభౌము డెట్లు కాగలడు? ముమ్మాటికి నతడు చరితార్థుడే. భూలోక మునం దందదగిన సకల యోగభోగమ్ముల నంది సంతు ష్టాంతరంగుడై మహాప్రస్థానమున కుద్యుక్తుడయినవాడు

కాని, అతనికి వెనుకచింత యావంతయేనియు లేదు; మృత్యువన్న భయ మీషణ్మాత్రమును లేదు.

జనకునింటికి నేగ సాధ్వి శంకించునే
కులగోత్రములు చెడ్డ కులటవోలె ?
పనిదీర్చు భటుడు స్వామిని జేర వెఱచునే
అకృతార్థుడైన సేవకునికరణి ?
చదువు శిష్యుడు పరీక్షకు భీతిచెందునే
బద్ధకించెడు మందబుద్ధిపగిది ?
స్వకుటుంబమునుగూడ జంకునే పరదేశి
పరదారవిత్తతత్పరునిసరణి ?
కాలశక్తులు సదుపయోగం బొనర్చి
బంధముల బాసి బుధు డాత్మభవనమైన
పరమపదమంద బెదరునే స్వప్నమందు
సర్వతోభ్రష్టుడైన సంసారిరీతి ?

కృష్ణవేణి: సరస్వతీ! నీ వన్నట్టు లతడు ముక్తసంగుడే కాని పుత్రవ్యామోహపాశము నన్ను దృఢముగ బంధించి వైచుచున్నది.

గౌతమి: సోదరీ, నీ శాస్త్రప్రసంగములు, తత్త్వబోధలు నా శ్రవణపుటంబులను స్పృశించి మఱలిపోవుచున్నవి కాని నా హృదయ కుహరమును బ్రవేశింపలేకపోవుచున్నవి. పుత్రశోకము నిరంతరమను మాట యీనాడు నా కనుభవ సిద్ధమైనది.

సరస్వతి : లోకధర్మము ననుసరించి శోకించుచున్నా మనుచు న్నారా ? పరిశీలించి చూచిన లోకాచారము తదన్యముగ నున్నది.

చింతింతురే హితుల్ చెఱసాల విడనాడి
స్వేచ్ఛ వర్తించు స్నేహితులకొఱకు ?
విలపింతురే కృషీవలులు నిండుగ బండి
తలవాల్చి కూలు పైరుల దలంచి ?
తపియింతురే బుధుల్ తాపమ్ము వాపి జీ
వన మిచ్చి నశియించు ఘనునిగూర్చి ?
కొందలింతురె కవుల్ కువలయప్రీతి సం
ధించి క్రుంకిన కళానిధి స్మరించి ?
తత్త్వవేత్తలు నిర్వర్తిత స్వధర్ము
లై తరించినవారికై వ్యసనపడరు ;
అఖలశాస్త్ర పురాణ వేదాంతసార
మంతయు నెఱుంగు మీకింత వంతయేల ?

గౌతమి : నీ యుక్తులు సయుక్తికములే, కాని మా మతులు వ్యామోహ సమ్మూర్ఛితము లగుటచే నవి యూషర క్షేత్రమున నాటిన బీజములవలె రూపఱి పోవుచున్నవి. ఏ యుపాయంబుచే నైన నాతని నొక్కపరి చూడగలిగి నచో నా వంత యొక్కింత శాంతించు నేమో !

కృష్ణవేణి : సోదరీ ! నా మనమున నున్న విషయమే గౌతమి సూచించినది. ఆతని లోకాంతర ప్రవృత్తి గమనించిన

గొండొకశాంతి లభించునేమో. కాని యట్టిది భూలోకమున నశ్రుతపూర్వము గదా !

సరస్వతి : నిజముగ నశ్రుతపూర్వమే !

భౌతిక శరీర మైహికవహ్ని దగ్ధ
మగుచు బంచభూతాలలో నైక్యమయ్యె,
నాత్మరూపంబు మనకంటి కందరాదు,
కాన దొల్లిటి తనువింక గానరాదు.

గౌతమి : (స్మృతి నభినయించి) అశ్రుతపూర్వ మననేల ? శ్రుతపూర్వమే. తొల్లి దేవకి యానతి శిరసావహించి రామకృష్ణులు కంసనిహతులయిన సోదరులను లోకాంతరము నుండి కొనివచ్చి తల్లి కానందము గూర్పలేదా ? కాని తాదృశ మహిమాన్వితు లిపుడు మన కెచట లభింతురు ? పుత్రకుని యనంతర ప్రవృత్తి దెలిసినగాని శాంతి లభించునటులు గోచరించుట లేదు.

సరస్వతి : గౌతమీ ! కృష్ణునివంటివారి కది సాధ్యమై యుండును. కాని యది యుగాంతర ప్రసంగము. [ఆలోచించుచు - తనలో] నన్నాదేశించిన దేవత లీ సందర్భమున నాకు సాయపడరా ? వారి యనుగ్రహమున నా కలవడిన దివ్యదృష్టి వీరికిగూడ నొసంగెదను.

కృష్ణవేణి : ఏమే ! సరస్వతీ ! పరధ్యానముగ నుంటివి ? మన యాస లడియాసలే యగునా ?

సరస్వతి : రామకృష్ణులు గొనివచ్చిన సోదరులు మాత్రము తల్లిదండ్రులయొద్ద స్థిరముగ నుండిరా ? తొలకరి మెఱుపువలె

కనుపడినట్లు కనుపడి యుత్తరక్షణమే వచ్చిన దారి పట్టలేదా ?

గౌతమి : స్థిరముగ మనయొద్ద నిలువకపోయినను సరే! ఒకసారి కంటబడిన జాలును. దానితోడనే సంతోషింతము. కృష్ణా! ఏమందువు ?

కృష్ణవేణి : అంతటి మహాభాగ్యము మన కబ్బునా ?

సరస్వతి : ఇంత యౌత్సుక్యముతో నుంటిరి. ఏ దేవతానుగ్రహముచేనైన మృతజీవులను జూడగలిగినను వారిని గుర్తుపట్టుట దుష్కరము. ఇంక వారికో, మన దృష్టియే యుండదుకదా !

కృష్ణవేణి : సరస్వతీ ! నీవు చెప్పినది సత్యమే యైయుండును. కాని యేదేని యుపాయమున్న నాలోచింపుము. ఒకసారి తనూజుని జూచి యానందింతము.

సరస్వతి : ఆలోచించుట కేమున్నది ? ఐహిక దృష్టిని విడనాడి యౌగికదృష్టి నలవఱచుకొనవలయును.

(గౌతమి శిరస్సున, కృష్ణ శిరస్సున క్రమముగ హస్తముంచి ధ్యానించి చేయి తీయును)

కృష్ణవేణి : (ఆశ్చర్యముతో) సోదరీ ! ఏమి, దుర్నిరీక్ష్యమై, దేదీప్యమానమై, అనంతగ్రహమండలపరివేష్టితంబై, తేజోమూర్తి సహస్రంబులు సేవించుచుండ విరాజిల్లుచున్నదే ! ఆలోకం బెవరిదో !

సరస్వతి : ఉత్తరాయణమున దనువు చాలించు పుణ్యాత్ములు చేరు మార్తాండమండలం బయ్యదియని యెఱుంగుడు.

గౌతమి : సకలకలాప్రపూర్ణము ప్రసన్న
మపారతమోనివారకం
బకుటిలవృత్త మప్రతిహ
తాచరణంబు సుధాకరోత్కర
ప్రకృతివిమోహితాప్తబుధవర్గము
సత్కృతి మార్గదర్శకం
బొక యకలంకతేజము
రయోద్ధతి జేరె నహో! అహర్పతిన్.

సరస్వతి : ఒక యకలంకతేజ మననేల? అది మన కవిరాజ తేజమే!

కృష్ణవేణి : కనులు మిఱుమిట్లుగొల్పు తేజము నా తండ్రి తేజమేనా! స్వప్నదృష్ట స్వరూపంబువోలె నవ్యక్తదర్శనమగుచున్నది.

[ తెరలో ]

"కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాంపతయే నమః"

గౌతమి : ఈ స్వరంబు నిజమ్ముగ కుమారునిదే! కృష్ణా! ఒరుల కిట్టి మధురగంభీరస్వర మెట్లలవడును? కంఠస్వరంబు చేతనే యీ తేజోరాశి మనవానిదని నిరూపింపనగును.

[ తెరలో ]

"భవునిన్ భావపదారవిందభవు
చెల్వప్పిళ్ళ వంశార్ణవో
ద్భవునిన్ శాస్త్రవదంవదాసహ
భవున్ భాస్వద్గవున్ సాహితీ

ధ్వనిఁ మేఘగభీర విస్ఫుటరవుఁ
ధైర్యప్రభా మేరువుఁ
గవితా సద్గురు వేంకటేశ్వరుని
వక్కాణింతు సెక్కాలముఁ".

కృష్ణవేణి: గౌతమీ! సజలజలదగర్జా సదృశంబైన యీ నినా దంబు చిరపరిచితమైనదిగ నున్నదే!

గౌతమి: నీకు గుర్తునకు రాలేదా! అది మన తిరుపతి శాస్త్రిది. తన వంశవర్ధనుండన్న యభిమానముచే దివాకరు డీతని తన యాస్థానమ్మునందే నిలుపుకొనియుండనోపును.

కృష్ణవేణి: అగుచో తన ప్రాణమ్ము ప్రాణమైన తిరుపతిని వీడ లేక మనవా డీ లోకంబుననే నిలిచిపోవునేమో!

సరస్వతి: త్రయీమయుడైన ఆదినారాయణునకు వందనపరశ్శ తంబు లర్పించి, మందస్మిత మాత్రమ్ముననే చెలిమికాడైన తిరుపతికానందంబు చేకూర్చి కుమారతేజోమూర్తి మఱల ప్రయాణోన్ముఖమైనది.

గౌతమి: తండ్రీ! రెండవ ప్రాణ మనదగిన శ్రీపతియందే నీకింత యౌదాసీన్య మేర్పడిననాడు మాయందు నీ కింక మమత్వముండి యుండునని భ్రమించుట కేవల మజ్ఞాన విలసితమే యగును.

కృష్ణవేణి: గౌతమీ! గౌతమీ! ఏమి యీ యద్భుతము! నా కన్ను లను నేనే నమ్మలేకున్నాను.

ప్రచలిత స్వర్లోక రుచిర సంగీత నా
దమ్ము కర్ణరసాయనమ్ము గూర్ప,

మందారకల్పకామందప్రసూన గం
ధము ఘ్రాణ సంతర్పణ మ్మొనర్ప,
ఆకాశ గంగాసమాయాత మారుతా
హతి దేహమునకు సౌఖ్యమ్మొలర్ప,
అప్సరోలాస్యహాస్యాదికమ్ము మనమ్ము
నానంద పారవశ్యమున దేల్ప,
నమర మౌనీంద్రు లాశీస్సు లందజేయ,
సపరివారంబుగా దిగ్గజంబు డిగ్గి
యెలమి సురరాజు కవిరాజు కెదురువచ్చి
స్వాగతం బిచ్చి తనుదాన గౌగిలించె.

గౌతమి : ప్రత్యుత్థాన మొనర్చిన దేవేంద్రుని గుమారు డాశీర్వదించుచున్నట్టు లున్నది.

[ తెరలో ]

"ఇతోఽప్యధికసంపత్తి రితోఽప్యధిక సంతతిః
ఇతోఽప్యధికకీర్తి స్తే" సురేశ్వర భవే త్సదా.

కృష్ణవేణి : త్రివిష్టపాధిపతి బద్ధాంజలియై యేదియో కుమారు నభ్యర్థించుచున్నాడు.

[ తెరలో ]

నృపులు కవుల యశము నిశ్చలమ్మొనరింతు,
రిలను నృపుల యశము నిలిపితీవు,
శంకలేనియెడల స్వర్గాధిపతికీర్తి
చిరము నిలుచునటులు చేయుమయ్య.

గౌతమి : కుమారుడు మహేంద్రుని సంప్రార్థన మంగీకరించునా?

[ తెరలో ]

"నరనాథుల్ పలుమంది మిత్రులయి
యున్నఁగాని తత్సన్నిధిఁ
స్థిరవాస మ్మొనరించునట్టి పని
నాచేగాదు" దేవేంద్ర ! నీ
కరయఁ బెద్ద కవీంద్రులే కలరు,
స్తుత్యంబయ్యె యుష్మత్కృపీ
శ్వర సత్కార పరత్వ మింక సెలవా
స్వస్థాన యాత్రార్థమై.

కృష్ణవేణి : తండ్రీ ! స్వర్లోక భోగ భాగ్యంబులే నిన్నాకర్షింపలేని నాడు భూలోక సౌఖ్యాది స్మరణమా నిన్నరికట్టునది ?

సరస్వతి : స్వర్గమును విడనాడి కవిరాజ తేజము సత్యలోకాభిగమనంబు చేయుచున్నది.

గౌతమి : సత్య శివ సుంద రాగమాశ్రయ పదంబు
శాంతిదాంతి విముక్తి విశ్రాంతిభూమి
నిశ్చలానంద కందంబు నేత్రములకు
విందుగూర్చు శతానంద మందిరమ్ము.

కృష్ణవేణి : కుమారుడు పితామహునకు ప్రదక్షిణ మొనరించుచున్నాడు.

[ తెరలో ]

ధాతకు సమస్తసర్గ వి
ధాతకు తాపస వరప్రదాతకు విప్ర

త్రాతకు నిఖిలాగమ ని
ర్మాతకు దాతకు నొనర్తు బ్రణతి శతంబుల్.

గౌతమి : సోదరీ ! మనవాడు వినయ వినమితగాత్రుడై శారదా దేవి పాదారవిందములకు సాష్టాంగవందన మాచరించి స్తోత్రము చేయుచున్నాడు.

[ తెరలో ]

"ప్రణమామి సదా గిర మాదరతః
సరసీరుహసంభవ కర్త్రిగతామ్
కవిరాడ్రసనాంచల చారుగృహాం
మునిరాజనుతాం ఫణిరాజనతామ్."

కృష్ణవేణి : గౌతమీ ! నిత్యసత్యవ్రతుండును బ్రహ్మాంతేవాసియు వాణీపద సమారాధకుడునగు కుమారుడు భారతీ వల్లభాను శాసితంబయిన యీ సత్యలోకంబున నిలిచిపోవునేమో!

[ తెరలో ]

"శతవధానంబులను వెదజల్లినారు
శిష్యులకు సంస్కృతాంధ్రముల్ సెప్పినారు
సులభమౌ తెల్గుకైతను జూపినారు
పావనంబు మా గురువుల జీవనంబు".

సరస్వతి : పితామహ లోకస్థితుడయిన అవ్వారి సుబ్రహ్మణ్యుని యుద్గీత మియ్యది. సుతనిర్విశేషుడయిన వాని గుణల ప్రశ్నంబుచే దేర్చి కవిరాజతేజము శ్రీమద్వైకుంఠాభి ముఖ మయినది.

గౌతమి : అది వైకుంఠపురం బదే కుసుమితో
ద్యానంబు ప్రాసాద మ
య్యదె పక్షీంద్రు డతండె భోగిశయనీయం
బయ్యదే వారె నా
రదముఖ్యామరయోగిపుంగవులు
పారావారరాట్కన్య య
ల్లదె కాలాంబుద నీలదేహు
డరవిందాక్షుండు గన్పట్టెడున్.

[ తెరలో ]

"శ్రీమంతం గుణవంత ముత్తమజనై
స్సంసేవ్యమానం కృపా
వంతం వార్ధిసుతానితంబయుగలీ
భారక్షమోరస్స్థలమ్
క్షీరాంభోధిశయాన మాశ్రిత కృపా
కల్పేఒహితల్పే పరం
దివ్యద్ధామవినిర్జితార్కశశినం
నారాయణం భావయే."

కృష్ణవేణి : తండ్రీ! నీ కారణంబున యోగిజన దుర్లభంబయిన శ్రీమన్నారాయణ దివ్యమంగళ విగ్రహ సందర్శనంబు లభించినది. నీవు సర్వధా పితౄణ విముక్తుడ వయితివి.

[ తెరలో ]

"భజామి హృదయే నితాంతరుచిరాం
సరోజ నిలయాం మురారి మహిలామ్

సముద్రతనయాం సమోదవినయో
దయామయతనుం మనోజజననీమ్."

గౌతమి : లక్ష్మీనారాయణుల పాదాభివందన మాచరించి తద్గుణ సంకీర్తనంబు గావించి విశ్రాంతికాముడైనట్టు లున్నాడు కుమారుడు.

కృష్ణవేణి : గౌతమీ! లక్ష్మీద్వితీయుడు, క్షీరసాగరశాయియునైన మన తనూజుడు ఆశ్రితవత్సలుం డయిన శ్రీమన్నారాయణుని యంశం బని తలంచుటయు బరిపాటియైనది. అట్లగుట నీత డీ యెడల విశ్రాంతి చెందునేమో!

సరస్వతి : క్షణమాగినట్లే యాగి యస్మత్తనూజతేజము కైలాసాభిముఖ మయినది.

గౌతమి : చూచితివా సోదరీ!

ఆనందకందమై అమృత ప్రపూర్ణమై
అలరారు నదె రజతాచలంబు,
అల్లదే కన్పట్టు నౌన్నత్యగాంభీర్య
దేహ మోయన నందివాహనంబు,
శివతాండ వాఖండ శిక్షావిధాభ్యాస
పరవశమ్మగు నదే ప్రమథగణము,
బర్హివాహన సముద్భాసితామరచమూ
పతియైన షణ్ముఖస్వామి యతడె,

వాడె గణపతి మూషకవాహనుండు,
దేవముని సేవ్య మదిగో తపోవనంబు,
అందు బొడగట్టు శివకామసుందరుండు
చంద్రచూడుండు శ్రితకాండశంకరుండు.

కృష్ణవేణి : అదె మన కుమారశివకవి సదాశివునకు ప్రదక్షిణంబు చేయుచున్నాడు.

[ తెరలో ]

శంకర ! గిరిజారమణా !
శంకాతంకాబ్ధితరణ ! సర్పాభరణా !
కింకరభవభయహరణా !
పంకేజభవాదిదేవ వందితచరణా !
"హర ! నీనాట్యపువేళ నంఘ్రియుగళీ
వ్యాఘట్టనఁ జేసి పెం
పఱి పాతాళము భిన్నభిన్నమగు,
శీర్షాఘాతముంజేసి యం
బరముఁ బీటలువారు, బాహుల దెసల్
సంభ్రమ్యమాణంబులౌ,
పరమాశ్చర్యము నీకు దానికి
నమోవాకంబు లోకాధిపా !"

గౌతమి : పంచాక్షరీజపదీక్షాపరాయణుడు మహాశివరాత్రి పుణ్య కాలమున పవిత్ర దుర్గాక్షేత్రమున భౌతికశరీరంబు చాలించు టంజేసి శివలోకంబు చేరికొనినాడు. ముం దేమికానున్నదో!

[ తెరలో ]

పంచాక్షరీజపసమాత్త శివప్రసాదం
వాణీకృపాసముదితామృతవాగ్విలాసమ్
కామేశ్వరీ చరణకంజ మరందలోలం
తం వేంకటేశ మనిశం మనసా స్మరామి.

సరస్వతి : కైలాసాచలంబును ప్రతిధ్వనింపజేయుచు పాపమెవరో
అంతేవాసి గురు సంస్మరణమ్ము గావించు చున్నాడు.
కుమారుడును సాంబశివుని సాభిప్రాయమ్ముగ( జూచి పునః
ప్రయాణోన్ముఖు(డయినాడు. ఏమి ? శివుడు నదృశ్యుడై
నాడు. కారణమేమైయుండును ?

కృష్ణవేణి : ఏమి యీ యద్భుతాపూర్వదృశ్యము ? కనులజూచిన
వైచిత్ర్యమును వాక్కు శబ్దములలో వ్యక్తముచేయ
జంకుచున్నది.

గౌతమి : మనస్సునకే అందరానినాడు వాగింద్రియవ్యాపార మెట్లు
సాగును ?

సరస్వతి : (నిదానించి చూచి)

నిండుజాబిల్లి వెన్నెల మిక్కిలిగ వెల్గి
యుప్పొంగుచున్న పీయూషజలధి
వేవెలుంగుల తేడు వెన్నుజూపెడు దశ్కు
దీపించు నా మణిద్వీపనగరి
పొలుపుచే వలపుచే మురిపించు ఫలపుష్ప
తతి నొప్పు కల్పకోద్యానభూమి
సురచాపముల డాలు సరకు సేయని దీప్తి
మలయు చింతామణీ మంటపమున
వేదవేదాంగములు భక్తి వినుతిసల్ప
దేవముఖ్యులు కాంతలై సేవగూర్ప
సప్తకోటిమహామంత్రసమితి గొల్వ
నమల నవరత్నభద్రసింహాసనమున

వెలయు శేషవిభూషణవిలసితుండు
నవనవోన్మేష యౌవనానందఘనుడు
కోటికందర్పసౌందర్య కోమలుండు
శాశ్వతసుఖాకరుండు కామేశ్వరుండు.

అతని వామాంకమున దదర్ధాంగలక్ష్మి
లలిత లలిత లావణ్య సంకలితమూర్తి
వాఙ్మనఃపాటవాతీత భవ్యశక్తి
ఆదికామేశ్వరీదేవి యలరు నెలమి.

గౌతమి: ఔను, జగత్పితరుల సమక్షమున దేవతలందఱు సమావిష్టులైనారు.

కృష్ణవేణి: అంతియే కాదు, అచట మఱొక గౌతమి, వేఱొక కృష్ణ, ఇంకొక సరస్వతి గూడ నున్నారే! కుమారతేజమా దేవతాద్వంద్వమునకు ప్రదక్షిణము చేయుచున్నది.

[ తెఱలో ]

నతు లివె మీకాదిమ దం
పతులకు హతవిమత దనుజ ప్రతిపత్తులకున్
వితత చిదానంద కళా
న్వితులకు పరిపాలితాప్తహితభక్తులకున్.

కృష్ణవేణి: ఏమి! దేవదుందుభులు మ్రోయుచున్నవే!

గౌతమి: పుష్పవర్షము గురియుచున్నది. హేతువేమైయుండును?

సరస్వతి: కుమారతేజము స్తోత్రముచేయుచు ప్రదక్షిణముచేసి కామేశ్వరీ పావనచరణారవిందములను స్పృశించి శాంతమై యందె విలీనమయినది.

కృష్ణవేణి : సర్వము అదృశ్యమయినదే !

గౌతమి : ఇపుడు దుర్గాక్షేత్రముతప్ప మఱొండేదియు గానవచ్చుట లేదు.

సరస్వతి : దేవదత్తమయిన దివ్యదృష్టి తొలగిపోయియుండును. తోబుట్టువులారా ! మీ మనంబులు కొంతగనైన శాంతి నందినవా ?

గౌతమి : (నిట్టూర్పు విడిచి) శాంతింపక చేయునదేమి కలదు ? కుమారునకా, ఇహలోక స్మృతియేలేదు.

కృష్ణవేణి : సర్వము శూన్యమై స్వప్నవృత్తాంతసదృశమై భాసించు చున్నది. శోకించి సాధించునదియు గనుపట్టదు.

గౌతమి : శోకించి సాధించినది లేకేమి ? కుమార వియోగార్తియే కదా మనకీ యోగిజన దుర్లభంబయిన దేవతాదర్శనము సమకూర్చినది !

సరస్వతి : శోక మొక్కొక్కయెడ కల్యాణకారి యగుటయు కలదు. వాల్మీకి శోకము సుశ్లోకమై శ్రీమద్రామాయణ పీయూషవర్షమున కాధారమైనది. అర్జున విషాదయోగమే లోకమునకు గీతామృతప్రవాహమును బ్రసాదించినది ! మహాత్ముల యుదయాస్తమయములు రెండును లోక కల్యాణకారణములే. మృత్యువునకు వెఱువనివాడే చరితార్థుడు. అతడే మృత్యుంజయుడు.

మృత్యువుతో నెవండు చెలిమిఁ
మననేర్చునో వానిపట్ల నా

మృత్యు. వవార్యమయ్యు నొక
మిత్రము వై ఖరి నత్రమంబుగా
నత్యయము ఘటించి తద
నంతర మంగళకారకంబునై
నత్యసుఖ ప్రశాంతుల నొసంగు
నిజంబిది నమ్మడీ చెలుల్ !

ఈ 'త్రివేణి' కవిద్వమై యెసగుగాక,
దేవతాచార్య పాద విధేయులకును
గౌరవాభీష్టసిద్ధి చేకూరుగాక,
స్వస్తి సర్వత్ర శాంతిః ప్రశాంతిరస్తు.

జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి యేషాం యశఃకాయే జరామరణజం భయమ్.